
సదాశివ సమారంభాం
గురు దక్షిణామూర్తి
గురు వేదవ్యాస మహర్షి
గురు శుక మహర్షి
గురు నారద మహర్షి
గురు వాల్మీకి మహర్షి
గురు శ్రీకృష్ణ
శంకరాచార్య మధ్యమాం
గురు దత్తాత్రేయ
గురు బాబాజీ
గురు గౌతమ బుద్ధ
గురు ఆదిశంకరాచార్య
గురు రామానుజాచార్యులు
గురు జ్ఞానేశ్వర్
గురు రవిదాస్
గురు కబీర్ దాస్
గురు చైతన్య మహా ప్రభువు
గురు నానక్
గురు రాఘవేంద్ర స్వామి
గురు వీరబ్రహ్మేంద్ర స్వామి
యోగి వేమన
అస్మదాచార్య పర్యంతాం
గురు త్రైలింగ స్వామి
గురు లాహిరి మహాశయ
గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి
గురు వివేకానంద
గురు సాయి బాబా
గురు అరబిందో
గురు రమణ మహర్షి
గురు యోగానంద
గురు భక్తివేదాంత ప్రభుపాద
గురు మళయాళస్వామి
గురు విద్యాప్రకాశానందగిరి
గురు చంద్రశేఖర పరమాచార్య
వందే గురుపరంపరాం..

నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2020050016707

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్ధం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాథ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in



# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

శ్రీజనార్దనస్వామినేనమః

శుభమస్తు, అవిఘ్నమస్తు

# తనయ శతకము

క. శ్రీరాముని పదపద్మము
మారుతిభజియించినట్టు ♦ మరువక మది గో
దూరుజనార్దన దేవుని
చేరి నిరంతరము భజన ♦ జేయుము తనయా. 1

క. చాడీలు జెప్పబోవకు
మూడిగముల జేయబోకు ♦ ముర్వీస్థలిలో
కోడిగములాడబోకుము
కోదూరుజనార్దనేశు ♦ గొల్వుము తనయా. 2

క. వాల్మీకాదుల సుకవులఁ
బాల్మలక నన్నపార్య ♦ ప్రభృతి సుకవులన్
తాల్మిని కొనియాడిన నగు
కల్మి కవిత్వంబుజెప్ప ♦ గా నగు తనయా. 3

క. ముద్దులకొమరులకును దగు
సుద్దులశతకంబు మదికి ♦ సొంపు దలిర్పన్
యొద్దికగా రచియించితి
తద్దయు భయభక్తిఁజదువ ♦ దగునో తనయా. 4

క. సంసారముపై బడినం
హింసాకరమగుచునుండు ♦ నెంతటిగుణికిన్
కంసారిపాదభజనము
సంసేవయొనర్ప నీవు ♦ చదువుము తనయా. 5

క. ఆటలకు జొరకుమెప్పుడు
బూటకముల బ్రొద్దుబుచ్చ ♦ బోకుము ధరలో
గూటనిడుసొమ్ము తల్లిని
మాటుపరచి దొంగిలించ ♦ మానుము తనయా. 6

క. కోట్లకొలది ధనమబ్బిన
చీట్లాటల నాడబోకు ♦ చీవాట్లగురా
పోట్లాట లాడబోకుము
వేట్లాటలు వేయవద్దు ♦ వినురా తనయా. 7

క. చెల్లాటలాడ కెప్పుడు
పిల్లలగుమిగూడి పిదప ♦ విపరీతముగన్
కల్లగిమాటలనాడిన
నల్లరివాడండ్రునిన్ను ♦ ననయము తనయా 8

క. అయ్యమ్మతో కలహించకు
నెయ్యమ్ముగ మెలగవలయు ♦ నీమిత్రులతో
దియ్యనిభక్ష్యంబులకున్
కయ్యంబులఁ జేయవలదు ♦ గదరా తనయా. 9

క. పనిముద్దుపాటముద్దను
జనవాక్యము మదినెఱింగి ♦ చదువరివగుచున్
పనితనము నేర్చుకున్నను
ఘనుడని నిను మెచ్చుకుండ్రు ♦ గదరా తనయా. 10

క. గారామును మరుగకుమీ
పోరాముల మీరి జేయ ♦ బోకుము బత్తిన్
శ్రీరాముని మరువకుమీ
వె రామములేక పాటు ♦ బడుమీ తనయా. 11

క. ఇంటను లేనివియున్నవి
కంటికిఁ గనబడినవెల్ల ♦ గావలెనని పెం
తంటాలఁ బెట్టబోకుము
తుంటరియన బరగుదీవు ♦ తుద కిలఁ దనయా. 12

క. జుట్టువిరబోసి తిరగకు
గుట్టెప్పుడు వెల్లడించ ♦ కుము బల్ రట్టా
పట్టినపట్టును నేతుద
ముట్టించెద ననుట గొప్ప ♦ ముప్పగు తనయా. 13

క. పొగచుట్టద్రావనోటఁ
పొగగ్రమ్ముమి యూటయూరు ♦ బోరెండును తా
నెగటగుపెద్దలకును సభ
మొగమెత్తగపరువుచెడును ♦ ముద్దులతనయా. 14

క. అప్పులుదొరకుగదా యని
పప్పులనప్పచ్చిలడ్లు ♦ భక్షించగ నా
యప్పేకుప్పలుగ బెరిగి
ముప్పుననే ముంచివేయు ♦ ముద్దులతనయా 15

క. జూదంబునాడితేనియు
వాదం బుదయించి యుభయ ♦ వాదుల కాపై
భేదంబుగల్గి తదుపరి
ఖేదంబయి తుదకు పెద్ద ♦ కీడగు దనయా. 16

క. క్షణమైన గడపిపుచ్చక
గుణయుతముగ చదువవలయు ♦ గురువులయొద్దన్
కణమైన విడచిపుచ్చక
గణియింపగ వలయుధనము ♦ గదరా తనయా 17

క. నూతనమగువస్త్రంబున
భాతిగరంగద్దివట్టు ♦ బాల్యమునందే
ఖ్యాతిగవిద్యాభ్యాసము
చేతనుచేతనుడు శుభము ♦ జెందును తనయా. 18

క. జీర్ణాంబరమునకు సా
వర్ణాంబువునూదుగాక ♦ వన్నెపొసగునే
పూర్ణదయముదుసలికి దగ
వర్ణక్రమమూదిజెప్ప ♦ వచ్చునె తనయా 1

క. తరిదప్పి సేయుకార్యము
నెరవేరక చెడుగడింది ♦ నేర్పరి కైనం
తరినెరిగి చేయుకార్యము
పరిపూర్ణముగా ఫలించు ♦ వసుధను తనయా. 20

క. ముద్దులకొమరుండైనం
బ్రొద్దెక్కినదాక నిదుర ♦ బొందినవానిం
మొద్దందురు గద్దందురు
వద్దందురు పనికి రద్ది ♦ వదురతనయా. 21

క. వేకువజామున లేచి వి
వేకముతో పూర్వపాఠ ♦ బృందంబుల జీ
కాకొందక వల్లించియు
ప్రాకటను పరీక్షనివ్వ ♦ వలయును తనయా. 22

క. భూషలు దాల్చగవచ్చును
వేషంబులు వేయవచ్చు ♦ వివిధంబులుగా
భాషావిచక్షణత్వము
నీషాధిపుడగుట గొప్ప ♦ నేర్పర తనయా. 23

క. నానాశాస్త్రములజదువ
జ్ఞానంబిసుమంతయైన ♦ గలుగనిచో యా
నానాశాస్త్రాభ్యాసము
నానార్థనిరర్థకంబు ♦ నగురా తనయా. 24

క. నీతోజదివెడుబాలుర
నీతోటిసమానముగను ♦ నిర్ణీతుడవై
చేతోమోదముజేసిన
ఖ్యాతిఁగనవచ్చు సుఖము ♦ గల్గును తనయా. 25

క. ఎక్కడవిద్యాగమమును
నెక్కడవిత్తాగమంబు ♦ నెక్కడసుఖముఁ
జక్కంబడదొకదినముఁ
నక్కడనివసించగూడ ♦ దరయగ తనయా. 26

క. విద్యయొసంగినవానిని
సద్యస్కాలప్రదాత్ము ♦ సత్కవివర్యుఁ
తథ్యములుబలుకు వానిని
హృద్యంబొనరించుచుండు ♦ మెప్పుడు తనయా. 27

క. ఉపనయన మొసగు వానిని
ఉపదేశంబిచ్చువాని ♦ యుద్వాహంబుఁ
కృపగల్గి చేయువానిని
సుపతినిమరువంగరాదు ♦ శుభములు తనయా. 28

క. చేసిన మేలును మరచిన
వాసిగ మనుపూరుషాళి ♦ వంచన జేయఁ
దోసమతని యమదూతలు
గాసిలగా నరకమందు ♦ గాల్తురు తనయా. 29

క. గురుజనముల నిందించకు
పొరుగిరుగుల వారితోడ ♦ పోరాడకుమీ
పరుసములబల్కకుండుమి
సరసవచోవృత్తిగానుమి ♦ సభలను తనయా. 30

క. పరిణయముగాకమునుపే
పరిపాటిగ శాస్త్రసమితి ♦ పఠియించవలెన్
పరిణయముగుతర్వాతను
పఠించగ చదువవీలు ♦ పడదురతనయా. 31

క. అత్తింటివారొసంగిన
విత్తంబుల జూచి విఱ్ఱ ♦ వీగకు మది నా
యుత్తముగ భ్రాతృవరులను
మొత్తముగా గలసి తిరుగ ♦ ముద్దగు తనయా. 32

క. భావంబందున నెప్పుడు
దైవంబే తోడటంచు ♦ ధైర్యము చేతన్
చేవలసినపని జేసిన
కావలసిన కార్యమగును ♦ గదరా తనయా. 33

క. మర్యాద నొసగి పరులకు
మర్యాదను దెచ్చుకొనుము ♦ మార్మసలక నీ
వార్యానుసరణి దిరుగుము
ధైర్యం బావంత విడకు ♦ తగదది తనయా. 34

క. యత్నము జేయగవలయును
నూత్నంబగు వస్తుతతి న ♦ నూనత గనగన్
యత్నము జేయక దేవు బ్ర
యత్నంబని యూరకుంట ♦ యగడగు తనయా. 35

క. నవరత్నంబులధామము
నవనిధులకు గాపురంబు ♦ నానార్థల స
న్నివసనము భరతఖండము
నవహిత మతిదెలుసుకొనియు ♦ నడుపుము తనయా. 36

క. సంజీవిన్యాద్యోషధ
సంజననము సకల జంతు ♦ జాలంబునకున్
సంజీవనదమ్మది జన
రంజన మీ భరతఖండ ♦ రాజ్యము తనయా. 37

క. ఈశునిపై భక్తి సకల
దేశీయులపైని రక్తి ♦ స్థిరసుగుణసమా
వేశాసక్తియుగల ను
ద్దేశముతో సంచరించు ♦ తిరముగ తనయా. 38

క. ధనమెంతగల్గియుండిన
మనమున నుప్పొంగ నతని ♦ మర్యాద చెడున్
జను లవమానింతురు చుల
కనగనుగనజూతు రెల్ల ♦ కాలము తనయా. 39

క. ధనమున్నందుకుగొప్పగు
గొనమేమియు లేకయున్న ♦ గొడవులబడు నా
తనిధనరూపపిశాచము
మానమున నెఱియంగ జేయు ♦ మరిమరి తనయా. 40

క. ఘనపైశాచముగల్గిన
తననొకఁనిబాధపెట్టు ♦ ధనపైశాచం
బనయము గృహాజనులందర
మునుముట్టగవేచుచుండు ♦ బోభువిఁ దనయా. 41

క. నినుజను లొగిగొనియాడిన
వినియుబ్బకు మనమునందు ♦ వినతుడవై సత్
వినయవిధేయుడవై భువి
మనగాంచుటయే కడింది ♦ మంచిది తనయా. 42

క. దుష్టునిదూరస్థునిగా
శిష్టునినికటస్థుగాను ♦ జేసినడువుమీ
కష్టమగుపనికిబోవకు
మిష్టాపూర్తులనుగొనుస ♦ మిష్టిని తనయా. 43

క. శ్రీకరముగల్గినప్పుడు
ప్రాకటముగ జేయవలయు ♦ పరమప్రీతిఁ
లోకోపకార మెప్పుడు
శ్రీకరమున కదియు మంచి ♦ స్థితియగు తనయా. 44

క. దరహాసముతోనైనను
పరిహాస మొనర్పరాదు ♦ పరికింపంగఁ
సిరిచేకూరినగాకను
పరువును పోవిడువవలదు ♦ వలదుర తనయా. 45

క. పరునిగుణంబణువైనను
సరసముగా సన్నుతింప ♦ సద్గుణమగురా
పరదుర్గుణంబులెప్పుడు
నణువైనను నెన్నబోకు ♦ మవనిని తనయా. 46

క. నష్టములుగల్గుగాకను
కష్టంబులు పైకిపైకి ♦ గ్రమ్మినగాకఁ
దుష్టత్వము మది నిడకుము
శిష్టత్వము వదలవలదు ♦ స్థిరముగ తనయా. 47

క. చెల్లనిమాటలనాడకు
మెల్లనిపనిపెట్టుకొనకు ♦ మెప్పుగ నతిథిన్
మళ్ళీమళ్ళీత్రిప్పక
నెల్లియనక శక్తికొలది ♦ నీగుము తనయా. 48

క. స్వజనముపై దాక్షిణ్యము
సుజనులపై భక్తిశ్రద్ధ ♦ జొన్పుము మదిలో
కుజనముపై పరుసమునవి
భజనముసోదరులతోటి ♦ బరుపుము తనయా. 49

క. సిరియెంతగల్గుగాకను
పెరవారిని మనసునైన ♦ బెదరించకుమీ
మరుగునకు జేరువానిని
గరుదయతో బ్రోవనీకు ♦ గొప్పగుతనయా. 50

క. తనకంటె నెక్కుడుగజను
ధనవంతులగన నసూయ ♦ తగనుండకుమీ
మనమున సంతోషించుము
ధనమూలముకాదె జగతి ♦ దనరగ దనయా. 51

క. దుర్వ్యయము జేయబోకుము
దుర్వ్యవసాయంబుచేత ♦ దుఃఖమువచ్చుం
దుర్వ్యసనంబులుమానుము
నిర్వ్యాపారంబుతగదు ♦ నీకును తనయా. 52

క. పరునికిగలసుగుణంబును
పరమాణువునైనగాని ♦ పర్వతమువలెన్
మరిమరియెన్నగదగురా
పరదుష్టగుణంబునెంచ ♦ వద్దుర తనయా. 53

క. పరుడొక డుపకృతిజేసిన
నిరతముమరువంగరాదు ♦ నెనరుంచవలెన్
కరుణారసమునువిడువకు
పరభూతగణంబుపైని ♦ వసుధను తనయా. 54

క. సరివారితోటిస్నేహము
సురుచిరముగ జేయవలయు ♦ సుశ్లోకుడవై
పరహింసగోరబోకుము
పరుని మనంబెరిగినడవ ♦ వలయును తనయా. 55

క. వగవకు దారిద్ర్యమునకు
నగరకు సిరిగలదటంచు ♦ నెవ్వరిపైకిఁ
పొగరున బోవకు మెప్పుడు
పగరకు మనసీయబోకు ♦ వసుధను తనయా. 56

క. నీచునకు నెంత జెప్పిన
దోచదుగా మదికి నెపుడు ♦ దొడ్డగుణంబుఁ
కాచంబుగరగిబోసిన
రోచిష్టమణిత్వ మగునె ♦ రూఢిగ తనయా. 57

క. గాజుపొడిపచ్చరూపే
బేజారుమనుష్యులెల్ల ♦ పెద్దలరూపే
బాజారుననిడ దెలియును
బేజారుగుణంబులెల్ల ♦ వినరా తనయా. 58

క. ఎరిగినమనుజుడొనర్చిన
తెరుగున నడవంగవలె త ♦ దితర జనంబుల్
పొరపాటు వచ్చెనేనియు
తిరముగ దిద్దించుకొమ్ము ♦ తేకువ తనయా. 59

క. వ్యాజ్యంబులనంగా పర
భోజ్యంబులనంగ నెపుడు ♦ పోథగదు సుమీ
యిజ్యంబులనగ దేవుని
పూజ్యంబులనంగ నెపుడు ♦ పోవుము తనయా. 60

క. ఇలజింతించగ నెప్పుడు
గలకాలము కలియుగంపు ♦ కాలంబయ్యెన్
కలకాలముగా నెరుగుము
కలకాలంబైనగాని ♦ కలుములు తనయా. 61

క. నిలువగ జేసిన మనమును
నిలువుగ జేయుదువు ధనము ♦ నిలయమునందున్
తెలియక జేసిన మనమున
తెలియక పోవుదువు మనము ♦ తెలియర తనయా. 62

క. ఏలినవానిన్ నీకున్
మేలొనరగ జేయువాని ♦ నీకంటెకడున్
మేలౌవానిగ జూడుము
మేలునుమరువంగ రాదు ♦ మేలిల తనయా 63

క. బలవంతుఁడైనగాని
పలువురతో నెదురుదిరుగ ♦ బాడౌనుగదా
బలహీనుఁడైనగానీ
పలువురలోఁగలయ బాగు ♦ పడురాతనయా. 64

క. మాయోపాయము లనేకుల
నాయత్తతఁజేరుకంటె ♦ న్యాయాన్వితుఁడై
న్యాయుండొక్కఁడెచాలును
వేయేలను బాగుపడఁగ ♦ వినరాతనయా. 65

క. చక్కనిరూపముగల్గిన
నెక్కుడుగుణముండదేని ♦ వృధయౌనుగదా
చక్కనగు మేడిపండులు
పక్కనపగలంగ క్రిములు ♦ వచ్చును తనయా. 66

క. పరభాధగలుగఁజేయుట
ధరఁబాపప్రాప్తికొరకు ♦ ధర్మాత్ముండై
పరునికినుపకృతిఁజేయుట
వరపుణ్యప్రాప్తికొరకు ♦ వరలగతనయా. 67

క. క్షేత్రముగని బీజమునిడు
పాత్రముగ నిదానధర్మ ♦ పరుడవుగమ్మా
నేత్రమునజూడ నిజమది
సూత్రముచేగూర్చవలెను ♦ శ్లోకముతనయా. 68

క. అధికారముగలిగియుతా
బ్రధితగుణప్రకరమూని ♦ ప్రబలనిచోన
త్యధిపుడయివెలయుకంటెను
విధవైయుండుటయెమేలు ♦ విధమాతనయా. 69

క. గతమునకు వగవకుండుము
హితమతివై సంచరించు ♦ మిల ప్రాణులకున్
మితభోజ్యుడవై యుండుము
మితభాషిత్వమున మెలగ ♦ మేలగు తనయా. 70

క. వనజోదరు పదభజనము
జననీజనకార్చనమును ♦ సజ్జన సంసే
వనమును గురుపూజనమును
దినదినమును సల్పవలయు ♦ తిరముగ తనయా. 71

క. పరధర్మపాలనము నిజ
వర ధర్మగుణాద్వయంబు ♦ పాపమనక నా
పరధర్మ మపహరించిన
వరనిజధర్మంబు చెడును ♦ వసుమతి తనయా. 72

క. మాసినవలువల గట్టకు
పాసిన యన్నంబు దినకు ♦ పరభామలతో
హాసంబైనను జేయకు
వేసంబులు వేయవలదు ♦ వినురా తనయా. 73

క. ఉద్యోగంబును ధనమును
విద్యయు బంధువు ప్రశస్త ♦ విదితత్వంబుఁ
హృద్యానవద్యబుద్ధికి
నుద్యమమున నైనబోల ♦ వుత్తమతనయా. 47

క. దైవమె ద్విజులకు నగ్నియు
దైవము ముని హృదయమందు ♦ తనుబుధులకుఁ
దైవము ప్రతిమారూపుడు
దైవమె యంతట సమాన ♦ దర్శని తనయా. 75

క. జగములు పదునాల్గింటికి
భగవంతుం డొకడు సుమ్మి ♦ పరికింపంగా
నగమున బరమాణువునను
సుగమంబుగ నిండియుండు ♦ సురుచిరతనయా. 76

క. నారాయణుడని హరుడని
యారూఢిగ బ్రహ్మయనగ ♦ నాయొక దేవుం
డేరీతి గొలుచువారికి
నారీతిగ నుండుటందు ♦ రాధ్యులు తనయా. 77

క. దైవవశము జగమఖిలము
దైవముమంత్రమున వశము ♦ తన్మంత్రము భూ
దేవాధీనము బ్రాహ్మణు
నావిష్ణువు నాకు దేవు ♦ డనె నటతనయా. 78

క. శ్రుత్యానుసారణంబగు
స్మృత్యర్థోక్తులననమ్మి ♦ స్థిరచిత్తుడవై
సత్యంబు బలుకు మెప్పుడు
నిత్యము ధర్మముగ నడువు ♦ నేర్పున తనయా. 79

క. పెక్కులుశాస్త్రములున్నవి
తక్కువకాలంబు చదువ ♦ తద్విఘ్నంబుల్
మిక్కిలియెక్కువగలవా
వాక్కులసారాంశమెరుగ ♦ వలయును తనయా. 80

క. స్మృతిశ్రుతిఋషివరమతులా
తతభిన్నములందుసార ♦ ధర్మమెరుగుమీ
క్షితిహంసమోటుల సలిలమి
శ్రితదుగ్ధములానునట్టి ♦ లీలను తనయా. 81

క. పలుకుముసత్యము ప్రియమును
పలుకకుమప్రియపు సత్య ♦ వాక్యముధరణిన్
పలుకకుమనృతప్రియమును
తొలిధర్మంబిదికరంబు ♦ దొడ్డదితనయా. 82

క. ఆయముమిక్కిలిగల్గిన
హేయములగు పనులుజేయ ♦ కెప్పుడుమదిలో
న్యాయముగ నడువ నాయా
దాయముసంపత్ప్రసిద్ధి ♦ దాయము తనయా. 83

క. కరమునకు పాత్రదానము
శిరమున శ్రీహరిమనస్సు ♦ జిహ్వాకుసత్యం
బరయుగ శ్రుతమును చెవికిని
స్థిరముగ భూషణములివి ప్ర ♦ సిద్ధము తనయా. 84

క. స్వర్ణాభరణముకంటెను
వర్ణాభరణంబు గొప్ప ♦ వానికి నెచ్చో
పూర్ణమగువిద్య దానన్
వర్ణమునకు వన్నెయదియె ♦ ప్రబలము తనయా. 85

క. ధవళాంబరమునదేహము
భువివాక్యార్థమున నోరు ♦ బుద్ధిసుగుణతన్
కవిలిఖితంబగుపద్యము
సువినయమగునట్టివిద్య ♦ శుభమగు తనయా. 86

క. సిరిగలిగిన సమయంబున
మురిపెంబున తక్కువద్దు ♦ మునురారాజే
యరిధికారము జేయగ
నరిగియు భంగంబునొందె ♦ యడవిని తనయా. 87

క. ఇడుములుగలకాలంబున
తడబడకుము మనమునందు ♦ ధైర్యం బెపుడున్
విడవకుము విడచితిరిగిన
విడచినచేజారుగుండ ♦ విధమగుతనయా. 88

క. సంపాదనగలిగెడుతరి
నింపాదిగనుండవలయు ♦ నేర్పుదలిర్పన్
వంపైనపనిని జేయకు
చంపదగిన శత్రునైన ♦ సతతముతనయా. 89

క. దుష్టుడె శత్రుడుసుమ్మీ
శిష్టుడె సద్బంధువెపుడు ♦ చింతించగ నీ
సృష్టినిగల జనములలో
దుష్టుడు బిడ్డయినద్రోయు ♦ దూరము తనయా. 90

క. వక్రంబైననురూపము
సక్రమమగు వర్తనమున ♦ సంపూజ్యంబౌ
వక్రమమగువీణాత్రి
విక్రముగీర్తనలబూజ్య ♦ విధమమెతనయా. 91

క. రూపరివైనను వస్తువు
పాపమునకు వెరువ డేని ♦ వర్జించుసుమీ
రూపమున మేడిపండుల
దీపోద్ధతమైనవాని ♦ తిందురె తనయా. 92

క. బీదలసాదలపై పర
మాదరముగనుండు మెప్పు ♦ డంగవిహీనుం
మేమరముగ దయజూడుము
మేదిని సురభక్తియుక్తి ♦ మెలగుము తనయా. 93

క. రారాజు బిడ్డడైనను
నేరములఁ జేసితేని ♦ నిందింతురు తా
రారాజరాజసుతుల
నేరములఁ మద్దులైరి ♦ నిజమది తనయా. 94

క. క్షీరాబ్ధిశాయిహరిత
త్క్షీరంబులఁ గానక గొల్ల ♦ క్షీరంబులనుఁ
జూరిన తీరున దీనిని
సారాగమవిదుల గొల్తు ♦ జవిగొన తనయా. 95

తెనాలి, భారతీ ప్రెస్సందు ముద్రితము—1940